కీ.శే. సుందర్లాల్ బహుగుణ 95వ జయంతి సమర్పణ

మహత్తర చిప్కో మహోద్యమానికి 50 సంవత్సరాలు (1973-2023)

# పర్యావరణ పరిరక్షణ

## (శాంతికి, సంతోషానికి, సంతృప్తికి మార్గం)




మూలం
కీ.శే. సుందర్లాల్ బహుగుణ

స్వేచ్ఛానువాదం
గౌరవ్



ప్రచురణ
మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక
పిఠాపురం

మహత్తర చిప్కో మహోద్యమానికి ఏభై ఏళ్ళు

# పర్యావరణ పరిరక్షణ

**(శాంతికి, సంతోషానికి, సంతృప్తికి మార్గం)**

మూలం

**కీ॥శే॥ సుందర్లాల్ బహుగుణ**

**(జపాన్‌లోని టోక్యోలో చేసిన ప్రసంగం)**

తెలుగు

**గౌరవ్**

**జనవరి, 2023**

ప్రచురణ

**మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక**



మూల్యం

**అమూల్యం**

విజ్ఞప్తి : ఇందులోని అభిప్రాయాలన్నింటితోనూ అనువాదకుడు, ప్రచురణకర్తలు అంగీకరించవలసిన అవశరం లేదు.

వివరాలకు

9032094492

gouravmeka@gmail.com

# అనువాదకుడి మాట

గత ఏడాది ఆగష్టు 15న అమృతోత్సవ సంబరాలు జరుపుకుంటున్న స్వాతంత్ర దినాన సహచరితో కల్సి దేశ రాజధానితోపాటు అమృత్‌సర్‌లోని వాఘా సరిహద్దు, జలియన్‌వాలాబాగు చుట్టొచ్చాం. ఆ సందర్భంగా 2017లో All India Pingaliwara Charitable Society ప్రచురించిన బహుగుణాజి టోక్యో ప్రసంగం Environment Protection అనే చిన్న పొత్తం కంటబడి తీసుకున్నాను. 2017లోనే నేను పనికట్టుకుని డెహ్రాడూన్ వెళ్ళి సుందర్లాల్ బహుగుణ, విమల దంపతుల్ని కలవడం జరిగింది. ఆ ఏడాదే జార్జ్ జేమ్స్ బహుగుణాజీని చేసిన ఇంటర్వ్యూని **'ప్రకృతి శాశ్వత ప్రగతి'** పేరిట తెలుగులోకి అనువదించి పుస్తకంగా ముద్రించి మానవతా వేదిక తరపు నుండి వందలాది ప్రతుల్ని ఉచితంగా అనేక ప్రాంతాల్లో పంపిణీ చేసాం. అప్పటికీ ప్రసంగ పాఠం సంగతి నాకు తెలియదు.

అయితే ఇది సుందర్లాల్ బహుగుణ 95వ జయంతి సందర్భం. ఆయన గతించి రెండేళ్ళవుతోంది. అలాగే 75 ఏళ్ళ క్రితం మహాత్మాగాంధీని పొట్టనబెట్టుకున్న మతోన్మాదం ఈరోజు పేట్రేగిపోతోంది. దేశం మొత్తం అన్ని రంగాల్లో తీవ్రమైన సంక్షోభాన్ని ఎదురుకుంటున్న సమయంలో ప్రపంచంలోనే విశిష్ట పర్యావరణ ఆందోళనగా పేరొందిన చిప్కో మహోద్యమానికి అర్ధశతాబ్ది ఉత్సవం సందర్భంగా ఉద్యమ రథసారధి అనుభవాన్ని ఆయన అక్షరాల్లోనే చదవగలగడం గొప్ప అనుభూతి. నిజాయితీ – నిబద్ధతలకి తిరుగులేని గాంధేయవాద ప్రతినిధి అయిన ఆయన ప్రసంగాన్ని చదివిన వెంటనే ఒక్కరోజులోనే తెలుగు చేసాను. కానీ ప్రచురణ భారం ఇతరేతర కారణాల వలన ఇప్పటికిలా వెలుగు చూస్తోంది.

ఇందులోని ఆత్మకి, ఆధ్యాత్మికతకి సంబంధించిన బహుగుణాజీ వాడిన పదజాలంతోనూ, ఆ మేరకు ఆయన భావజాలంతోనూ నాకు వ్యక్తిగతంగా భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. అయినప్పటికీ యాంత్రికత రాజ్యమేలుతున్న వర్తమాన సమాజంలో మానవతను శోధించే స్వరాలు ఎంతైనా అవసరమనే అభిప్రాయమే ఈ అనువాదానికి ప్రేరణ. ఆయన సూచించిన ఆధ్యాత్మికతను నేను అంగీకరించ నప్పటికీ బహుగుణాజీ భావాలు ఈనాటి సమాజానికి అత్యవశరాలని తలిచి ఈ పొత్తాన్ని తెలుగు చేయడం జరిగింది. ఇందులోని అచ్చుతప్పులకూ, అనువాద దోషాలకూ పూర్తి బాధ్యత నాదే. నా ఆసక్తే ఇదిలా రావడానికి ముఖ్య కారణం.

సాహిత్య–సామాజిక–సాంస్కృతిక రంగాల్లో అమలవుతున్న స్తబ్దత అసలుకి మనిషికీ మనిషికీ నడుమ ఏర్పడుతున్న దూరానికి ప్రతీక. దానికి విరుగుడు ముందు మనిషి ప్రకృతిలో మమేకమవడం మాత్రమే. అందుకోసం భిన్నమార్గాల్లో కృషిచేస్తున్న మిత్రులందరి ప్రయత్నాల్ని సవినయంగా గౌరవిస్తూ, అనేక పరిమితులకు లోబడి ఈ చిన్న పుస్తకాన్నిలా మీ చేతుల్లోకి తీసుకురావడం జరుగుతోంది. లోకంలో ప్రతీ దానికి ఒక చరిత్ర అనేది ఉంటుంది. ఆ సంబంధిత అంశానికి చెందిన చరిత్రే భవిష్యత్తుకి బాట చూపుతుంది. గతంలో నుండి ఆగతానికి పయనించే ఆ గతినే చారిత్రక దృక్పథం అంటారు. ఆ విధంగా మహత్తర ‘చిప్కో’ మహోద్యమం యొక్క చరిత్రని అధ్యయనం చేయడం ఈనాటి ఆలోచనాపరులు, సామాజిక కార్యకర్తలందరి విధి. అందుకే ఇది.

**విమర్శలకు ఆహ్వానం.**

# అంకితం



విదురశ్వతలో అమరవీరుల స్థూపం

గతేడాది ఫిబ్రవరిలో సహచరితో కలిసి నాన్నగారి స్నేహితులు విద్యాసాగర్ గారి దగ్గరకు హిందూపూర్ వెళ్లాం. ఆ సందర్భంగా కర్నాటక సరిహద్దు ప్రాంతాలు కూడా చూసాం. వాటిలో ఒక ముఖ్యమైన చారిత్రక ప్రదేశం, దక్షిణాది జలియన్‌వాలాబాగ్‌గా ఖ్యాతినొందిన విదురశ్వత. అక్కడి వీరుల త్యాగాన్ని అక్షరీకరించి కనీసం 85 ఏళ్ళయిన సందర్భంగా చిన్న పుస్తకంగా తీసుకురావాలని తలిచాను. విదురశ్వత స్మృతిగా ముద్రించిన తపాల కవరు మొదలు ఇంగ్లీషు, కన్నడ భాషల్లో ప్రచురించిన పుస్తకాన్ని కూడా అక్కడి నిర్వాహకుడిగా ఉన్న రామకృష్ణగారు ఆత్మీయంగా ఇచ్చి ఆ ప్రదేశం విశిష్టత తెలుగువారికి తెలియ జేయవలసిన అవసరం వుందన్నారు. అంగీకరించిన నేను ఏదోక ప్రయత్నం చేస్తానని మాటిచ్చాను. కానీ నిలుపుకోలేకపోయాను. ఫిబ్రవరి 28న నాన్న ఆకస్మికంగా మరణించారు. ఆ తర్వాత అడపాదడపా కార్యక్రమాలు చేస్తున్నప్పటికీ ఈ విషయం నన్ను తొలుస్తూనే ఉంది. అందుకే నాన్నగారి సంస్మరణ సందర్భంగా తీసుకొస్తున్న ఈ చిన్ని అనువాదాన్ని 1938లో స్వాతంత్రోద్యమ స్ఫూర్తితో బ్రిటీష్ తూటాలకి ఎదురెళ్ళి ధైర్యంగా ప్రాణాలర్పించిన 32 మంది అమర వీరుల స్మృతి చిహ్నంగా నివేదించుకుంటూ, వారి పోరాటతత్వానికి తలొంచి సగౌరవంగా నివాళులు అర్పిస్తున్నాను.

# ముందుమాట

ఇది ప్రపంచీకరణ యుగం. ఇందులో ప్రజలకి శాశ్వతమయిన శాంతి, సంతోషం, సంతృప్తి పొందగల జీవన విధానాన్ని పొందేలా వారికి సాయపడగలగడమే మన ప్రధాన ఉద్దేశం కావాలి. ఈరోజు అంతటా తాత్కాలిక సుఖశాంతులే ఉన్నాయి. ఈనాడు జరుగుతున్న మన అభివృద్ధి అంతా ప్రకృతిని దోచుకోవడం వల్ల ఆవిర్భవించిందే. కేవలం మనుషులు మాత్రమే అభివృద్ధి పేరిట ప్రకృతిని నాశనం చేస్తున్నారు, ఇతర జీవులేవీ ఈ పాడుపని చేయవు. ప్రకృతితో సామరస్యంతో జీవిస్తాయి. ఈరోజు మనమందరం ఒక బీద తల్లి యొక్క ధనవంతులయిన పిల్లల వంటి వాళ్ళం. ప్రకృతి తల్లి ఆమె ఎంత పేదరికంలోకి పడిపోయినా కన్నతల్లి కర్తవ్యంగా భావించి మనల్ని జాగ్రత్తగా సాకుతూ కాపాడుకుంటోంది.

1943 బెంగాల్ కరువప్పుడు జీవచ్ఛవంలాంటి తల్లి రొమ్ముల్ని పాలకోసం పంటితో కొరుకుతున్న చిన్నారి ఫోటోను మనం చూసాం. చివరి క్షణం వరకు ఆమె బిడ్డని సాకడానికే ప్రయత్నం చేసింది. ప్రకృతిమాత పరిస్థితి కూడా ఈరోజు సరిగ్గా అలాగే ఉంది. ఆమె మరణావస్థలో ఉండి కూడా మనందరి అవసరాలు తీరుస్తోంది. మనం మాత్రం పీకల్లోతు అభివృద్ధిలో కూరుకుపోయి, ఆమె సంగతే అసలు మర్చిపోయాం. అయినప్పటికీ, ప్రకృతి పెద్ద మనసుతో మన బాధ్యత నెత్తికెత్తుకుంది. మరప్పుడు మనమేం చేయాలి? పిల్లలుగా మన బాధ్యతేది??

ఈరోజు ప్రపంచం ఎదురుకుంటున్న మూడు ముఖ్య సవాళ్ళలో పర్యావరణం ఒకటి. మొదటిది యుద్ధం. గడిచిన శతాబ్దాల్లో జరిగిన యుద్ధాలు గొప్ప వినాశనాన్ని మాత్రమే మనకి మిగిల్చాయి. అయినా ఈరోజు చిన్న చిన్న దేశాల్లోని ప్రజలు కూడా ఆయుధ సంపత్తిని కూడగట్టుకుంటున్నారు. ఎందుకు? ఆత్మరక్షణ కోసమని వాళ్ళ వాదన. ఎవరి నుండి ఆత్మరక్షణ? మనలానే బతుకుతున్న పొరుగువాళ్ళనుండి. మధ్యలో ఎవరికి లాభం? ఆయుధాల్ని ఇరువైపుల వారికీ అంటగట్టి వ్యాపారం చేసి అమ్ముకునేవారికి. ఆయుధాల కోసం చేసిన ఖర్చులు, పద్దులు, వాటి లెక్కలు ప్రభుత్వాలు చెప్పవు. రహస్యంగా ఉంచుతాయి. ఏ ప్రజల నెత్తిన పన్నుల పేరిట ఈ సొమ్మంతా దండుకుంటారో వారికే అవి రహస్యాలనమాట మరి. ఇక ఈ పేద దేశాల బీదల డబ్బంతా మొత్తం ఆయుధ వ్యాపారుల చేతికి పోతుంది. కొత్త ఆయుధాలు కావాలంటే ఉన్నవాటిని ఏదోలా వాడిపారేయాలి. అందుకే, మానవాళికి వున్న మొట్టమొదటి సమస్య యుద్ధం గురించి ప్రమాదం.

ఇక రెండో సమస్య కాలుష్యం. మొత్తం మనిషి చరిత్ర అంతా భూతద్దం పెట్టి వెతికినా ఇంతటి కాలుష్యం మనకి గతంలో ఎక్కడా కనిపించదు. ఆకాశం, నదులు, సముద్రాలు అన్నీ మనం కలుషితం చేసేసాం. ఇక ఎక్కడని జీవిస్తాం? మనం కాలుష్యానికి ఎంతగా అలవాటు పడిపోయామంటే, క్రమంగా మరణానికి దగ్గరవుతున్నామనే విషయం కూడా గుర్తించనంతగా. అందుకే రోజురోజుకీ మనం బలహీనులుగా తయారవుతున్నాము. ఇక చివరి మూడో సమస్య పేదరికం. కాబట్టి, నేటి మానవాళి ముందున్న మహోన్నత లక్ష్యం ఈ మూడు సమస్యలు : యుద్ధం, కాలుష్యం, పేదరికాల నుండి విముక్తి కావడం.

ఈరోజు మీ ముందున్న సవాలు ఏమిటంటే, భావితరాల కోసం సమాజాన్ని ఎలా మార్చబోతున్నారన్నదే. ఎలాంటి వ్యవస్థను తర్వాతి తరాల శ్రేయస్సు కోసం మీరు నిర్మిస్తార్ననదే. ఈనాటి వ్యవస్థ ప్రధానంగా నాలుగు స్తంభాల మీద నిలిచి వుంది. మొదటిది అధికారం. రెండు సంపద, మూడోది ఆయుధాలు, నాలుగోది అత్యున్నత విద్య. ప్రతి ఒక్కరూ వీటికోసం పరుగు పందెంలో వారి ప్రమేయం లేకుండా పాల్గొనేవారే. అధికారం కనుక నా చేతిలో ఉంటే ఇతరుల మీద అజమాయిషీ చెలాయించవచ్చు. నా దగ్గర ఎక్కువ డబ్బులుంటే ఎక్కువ సౌఖ్యాలు పొందచ్చు. ఆయుధాలతో అందర్నీ బెదిరించవచ్చు. ఇక చాలా కొద్దిమందికి మాత్రమే సాధ్యమయ్యే పెద్దపెద్ద చదువులు చదివితే, సామాన్యులకి దూరంగా గొప్ప విషయాలు అర్థం చేస్కోవచ్చు.

ఆధిపత్యంతో కూడిన అధికార హోదా స్థానంలో సేవా తత్పరతతో ఉండే పోటీతత్వం వస్తే ఎక్కువ మంది ప్రజలకి ప్రయోజనం. విలాసవంత సంపద అంతట్నీ వీలయినన్ని తక్కువ వస్తు సామాగ్రి ఉపయోగించేలా క్రమబద్ధీకరించుకోవాలి. ఈ సంపద అంతా ఎక్కడ నుండి వచ్చింది? భూమి నుండి మాత్రమే వచ్చింది. పుడమిని దోపిడీ చేస్తే పుట్టింది. ఇక ఆయుధాల స్థానంలో ప్రశాంతతకి మనం చోటు కల్పించాలి. ఇంకా మన గ్రంథాలయాల్లో, కార్యాలయాల్లో అనేక సిద్ధాంత తత్వాల గురించిన లావుపాటి పుస్తకాలు బోలెడన్ని ఉన్నాయి. కానీ మన రోజువారీ ప్రవర్తనకి ఈ జ్ఞానం ఏమాత్రం అక్కరకి రాదు. కాబట్టి ఉన్నతమయిన చదువు బదులు మంచి నడవడికను ఏర్పరచాలి. అప్పుడిక ప్రస్తుత వ్యవస్థలో ఉన్న స్తంభాలను మార్చేందుకు ప్రయత్నించవచ్చు. కొత్త స్తంభాల్లో స్నేహతత్పరత, నిరాడంబర జీవనశైలి, ప్రశాంత దృక్పథం, మంచి ప్రవర్తన అనేవి ఉంటాయి. ఇవి మనకి ఆనందాన్ని ఇస్తాయి. శాశ్వతమయిన సుఖశాంతుల్ని సంతృప్తిగా అనుభవించగలం. మనిషి జీవితానికి ఇదే అంతిమ లక్ష్యం : సంతృప్తిగా సుఖశాంతుల్ని ఆస్వాదిస్తూ సంతోషంగా జీవించగలగడం. ఈరోజు మీ చుట్టూ ఉన్న సుఖాలేవీ శాశ్వతమైనవి

కావు పైగా వాటిల్లో ఎప్పటికీ సంతృప్తనేది ఉండదు. ప్రతి ఒక్కరూ సంతోషంగా, సంతృప్తిగా జీవించగలిగే ప్రపంచాన్ని మనం నిర్మించగలగాలి.

అందుకోసం ముఖ్యమైన అంశం నిరాడంబరత; వీలైనన్ని తక్కువ వస్తువుల్ని ఉపయోగించగలగడం. దురదృష్టవశాత్తూ, ఈరోజు ప్రజలు ఎక్కువ వస్తువుల్ని వినియోగించడమే నాగరికతకి ప్రమాణంగా భావిస్తున్నారు. కానీ ఈ వినిమయంలో ఇతరులకి న్యాయంగా చెందవలసిన వాటాతో పాటుగా, భావితరాలకి చెందకుండా లాగేసుకుంటున్న దోపిడీ కూడా ఇమిడి వుందనే విషయాన్ని అర్థం చేసుకోవడంలేదు. మహానుభావులందరి మార్గం నిరాడంబరతే. బుద్ధుడు, క్రీస్తు, గాంధీ మహాత్ముడు మొదలైనవారికి ఎన్ని జతల బట్టలున్నాయి? మహాత్మాగాంధీ చనిపోవడానికి ముందురోజు నాకు ఆయన్ని కలుసుకునే అవకాశం వచ్చింది. ఆయన చాలా సాదాసీదా మనిషి. ఒంటిపై ఒక్క గుడ్డముక్క కప్పుకునే వారంతే. మహానుభావులంతా ప్రకృతితో మమేకమయ్యే జీవిస్తారు. మీరు ప్రకృతికి ఎంత దగ్గరైతే అంత ఆనందంగా, ఆహ్లాదంగా జీవించగలరు.

ఈరోజు మనం ప్రకృతికి దూరంగా పారిపోతున్నాం. ఆ క్రమంలో ప్రకృతిని నాశనం చేస్తున్నాం. గతంలో చెట్ల కింద కూర్చుని ఆకాశాన్ని ఆస్వాదించే రోజులుండేవి. కాబట్టి, ప్రకృతి దగ్గరకి వెళ్ళండి. ప్రకృతి మీ సమస్యలన్నింటినీ తీర్చడం మాత్రమే కాదు, మీకు శాశ్వతమయిన సంతోషాన్ని కూడా ప్రసాదిస్తుంది. మూసి ఉన్న నాలుగ్గోడల గదిలో మీ ఇంద్రియాలు కూడా మూసుకుపోతాయి. ఎప్పుడైతే ప్రకృతికి దగ్గరవుతారో అప్పుడిక మీరు సంతోషంగా, సంతృప్తిగా, ఆరోగ్యంగా ఉండగలరు.

అత్యంత తక్కువ వస్తు సామాగ్రితో జీవించగలిగిన మహానుభావులంతా వారి జ్ఞాపకాల్ని మిగిల్చి కాలగర్భంలోకి వెళ్ళిపోయారు. బుద్ధుడు, అలాగే బీదవారికి భూములు దానంగా ఇమ్మన్నమన్న గాంధీ శిష్యుడు వినోభాభావే, అలాగే పోయారు. ఆనందంగా జీవించడానికి అవశరమయ్యే రహస్యాలు ఇవే. ప్రకృతితో మమేకమై జీవించగలగడం. ఉదయాన్నే లేచి రెండుమూడు కి.మీ. నడిచొస్తే మీకెంతో హాయిగా, తాజాగా ఉంటుంది. మనం ఏసీలు, టీవీల ద్వారా పొందే తాజాదనం తాత్కాలికం. శక్తికీ సంతృప్తికీ సారం, మూలం ప్రకృతే. పక్షులకి ఫ్రిజ్‌లు, హాస్పటళ్ళు లేవు. కనుకనే అవి ప్రకృతితో కలిసి సంతోషంగా ఉండగలుగుతున్నాయి. ప్రకృతికి దగ్గరగా వెళ్ళమని మాత్రమే నేను మీకు చెప్పదల్చుకున్నాను. సెలవు.

**– సుందర్లాల్ బహుగుణ**

# మా అనుభవాలు - మీకిచ్చే సందేశాలు

మహాత్మాగాంధీ మరణించడానికి ఒక్క రోజు ముందు ఆయన్ని కలుసుకునే అదృష్టం నాకు కలిగింది. జనవరి 29, 1948న ఆయన్ని కలుసుకున్నాను. 1947లో దేశం స్వాతంత్ర్యం పొందాక కూడా రాచరిక పరిపాలన నుండి విముక్తి కోసం హిమాలయాల్లోని మా ప్రాంతంలో స్వాతంత్ర్యోద్యమం కొనసాగింది. గొప్ప సంఖ్యలో ఉద్యమం చేపట్టిన వేలాదిమంది ప్రజలు చివరికి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు సాధించారు. ఇందుకోసం గొప్ప పోరాటయోధుడు శ్రీ దేవ్‌సుమన్ జైల్లో 84 రోజులు నిరాహార దీక్ష చేసి మరణించి ఈ మహత్తర కార్యాన్ని సాధించాడు. ఆ స్ఫూర్తితో ప్రజా ఉద్యమం ద్వారా ఇద్దరు కార్యకర్తలు అమరులు అవగా మా స్వరాజ్యాన్ని మేం పొందాం. అయితే ఏ ప్రభుత్వ అధికారినీ మేం అవమానించలేదు. ఆవేశంలో ఉన్న ప్రజలు అధికారుల మీద దాడులు చేయకుండా వారిని రక్షించాం కూడా. జాగ్రత్తగా వారి దుస్తులు, సామాన్లు, ఆహారాన్ని సమయానికి జైలుకే పంపించాం. ఇదంతా తెలియజేయడానికి మేం గాంధీగారి వద్దకు వెళ్ళాం. ఆయన ప్రేమగా నన్ను తడుతూ,



**మహాత్మాగాంధీతో సుందర్లాల్ బహుగుణ**

“నువ్వు నా అహింసని భూమ్మీదికి దించావు; అంతేకాదు నువ్వు చేసిన ఈ ఘనకార్యం హిమాలయాలంత మహోన్నతమైనది.” అన్నారు. ఆరోజు జనవరి 29, 1948. మరునాడే ఆయన హత్య కావించబడ్డారు.

గాంధీ భారతదేశానికి స్వాతంత్ర్యం తీసుకువచ్చారని చాలామంది అంటుంటారు. అయితే ఆయన ఆలోచనలు చాలా విభిన్నమైనవి. ప్రపంచ చరిత్రలో ఒక దేశ స్వాతంత్ర్యానంతరం దానిని పాలించని ఏకైక పోరాటయోధుడు గాంధీ. గ్రామ స్వరాజ్య స్థాపనే ఆయన అసలు సిసలు లక్ష్యం. అంటే దేశంలోని గ్రామాలన్నీ సమృద్ధి చెంది స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని పొందడం. పైగా ప్రజల నిర్ణయాధికారం గల వికేంద్రీకరణతో కూడిన ప్రభుత్వ విధానాలు పైనే ఆయన విశ్వాసం. అందులో ప్రజలే పాలకులు, పద్ధతులు వారి ఇష్టాయిష్టాలతోనే నిర్ణయించబడతాయి. అంతేకానీ కేంద్రీకృత ప్రభుత్వాలో లేక పార్లమెంటు భవనాలో కాదు. ఆ రకంగా ప్రతి గ్రామము ఒక స్వయం సమృద్ధ గణతంత్ర రాజ్యంగానే (రిపబ్లిక్) భాసిస్తుంది. చివరగా ఆయన ఏం చెప్పారంటే, “ఇక జాతీయ కాంగ్రెస్ ఒక సంస్థగా చేసిన పని చాలు; ప్రధమశ్రేణి నాయకులు అందరూ గ్రామాలకి పోయి ప్రజలు స్వయంపాలన సాగించడానికి తగిన విధంగా సాయపడాలి” అన్నారు. కేంద్ర ప్రభుత్వం అనే పద్ధతిని అసలాయన ఇష్టపడలేదు. ఆయన ఆశించింది ప్రతీ గ్రామంలోనూ ప్రజాప్రభుత్వం, ప్రజలే పాలకులుగా ఉండే ప్రజాస్వామ్యం.

ఈరోజు కేంద్రీకృత విధానంలో ప్రబుత్వ ఆధీనంలోని ఉద్యోగ స్వామ్యాన్ని ఏర్పాటు చేయాలి.. ఇది చాలా ఖర్చుతో కూడుకున్న ఖరీదయిన వ్యవహారం కాగా – ఈ అధికార నిర్వహణ పద్ధతి దానికదే ఏ ఉత్పాదకతా లేని కార్యక్రమం. ఉత్పత్తి రహిత పనులు జరిగే ఏ వ్యవస్థలోనయినా ఆ భారం అంతా సామాన్యుల మీద పడుతుందనేది సులభమయిన ఆర్థిక సూత్రం. ఖరీదైన కార్యనిర్వహణ యంత్రాంగం ఉండరాదు. విదేశీ వ్యవహారాలు, భద్రత వంటి ఒకట్రెండు అంశాల్ని కేంద్ర ప్రభుత్వం చూసుకోవచ్చు. కానీ ఇతరేతర వ్యవహారాలన్నీ ప్రజలే స్వయంగా చూడాలి.

మహాత్మాగాంధీ మహా దార్శనికుడు. భారతదేశంలో ఉన్న లక్షలాది గ్రామాలు ఎవరి దయాదాక్షిణ్యాలపై ఆధారపడకుండా తిండి, బట్ట, వసతి వంటి కనీస అవశరాల విషయంలో స్వయం సమృద్ధి చెంది గణతంత్ర వ్యవస్థలుగా రూపొందాలనేది ఆయన దృక్కోణం. గాంధీ ప్రారంభించిన ‘ఖాదీ’ కార్యక్రమం

యొక్క ముఖ్యోద్దేశం ఇదే. ఇందువల్ల గ్రామీణ యువతకి ఉపాధి మాత్రమే కాదు, కేంద్రీకృత ఉత్పత్తి విధానపు దోపిడీ, నగరాల్లోని మురికి కూపాల్లో వలస కార్మికుల బతుకులు, రవాణా వంటి అనేక అంశాల నుండి గ్రామీణులు మినహాయించ బడతారు. ఇదే గాంధీగారి స్వప్నం, కానీ దానిని సాకారం చేసుకునేందుకు ఆయన జీవించిలేరు.

హిమాలయాల్లోని మారుమూల ప్రాంతాల్లోకి గాంధీజీ సందేశాన్ని ఇద్దరు ఆంగ్ల మహిళలు తీసుకువెళ్ళారు. వాళ్లు మీరాబెన్, సరళాబెన్‌లు. మీరాబెన్‌కి పశు పోషణ అంటే ఆసక్తి. ఆమె పశులోక్ పేరిట పశుశాలని రిషీకేష్ కొండల దిగువ స్థాపించింది. కానీ, త్వరలోనే భగీరథి నది ద్వారా ఉద్భవించబడిందని చెప్పబడే భిలంగణా నదికి 100 కి.మీ. దూరంలో టెహ్రిఘర్‌వాల్ ప్రాంతంలో జిన్సీ అనే గ్రామానికి చేరింది. అక్కడ గోపాల్ ఆశ్రమాన్ని స్థాపించి పర్వత ప్రాంత గ్రామాల్లో గాంధేయవాద స్వయం సమృద్ధ వికాసానికి తనవంతు పాటుపడింది. ఎంతోమంది స్థానికుల్ని ఆమె ఉత్తేజపరిచింది.




**చిప్కో ఉద్యమంలో ప్రచారం చేస్తున్న బహుగుణ**

సరళాబెన్, డాక్టర్ మోహన్ సింగ్ మెహతాతో పాటు అధ్యాపకురాలిగా పనిచేయడానికి ఇంగ్లాండు నుండి ఇక్కడికి వచ్చింది. ఉదయపూర్‌లో ఆమెకు సరిపడక వార్ధాలోని గాంధీజీ సేవాగ్రాం ఆశ్రమానికి వచ్చి నయీతాలీం పేరిట అమలవుతున్న నూతన విద్యావిధానానికి సంబంధించిన ప్రయోగాత్మక పద్ధతులలో పాల్గొంది. వార్ధాలో కూడా వేడి వాతావరణం ఆమెకు సరిపడక కుమావ్ హిమ పర్వతాలకి దగ్గర్లోని చునాదా గ్రామంలో గాంధీ ఆశ్రమానికి చేరింది. అక్కడామె ప్రజలతో కలిసి స్వాతంత్ర్య పోరాటాలకి వార్ని సన్నద్ధుల్ని చేసింది. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో బ్రిటీష్ ప్రభుత్వం ఆమెను అత్యంత ప్రమాదకరమయిన వ్యక్తిగా అభివర్ణిస్తూ అరెస్టు చేసింది. హిమగిరి మహిళల శక్తిసామర్థ్యాలు ఈమె గుర్తించింది. అందుకే స్వాతంత్ర్య సమరంలో వారితో కలిసి నడిచింది. బ్రిటీష్ వారి ఖైదు నుండి విడుదల అయ్యాక ఈమె పర్వత ప్రాంత బాలికల కోసం కుమావ్ పర్వతాల్లో కౌశాని గ్రామంలో నయీతాలీం విద్యావిధానం కోసం లక్ష్మీ ఆశ్రమాన్ని స్థాపించి కృషి చేసింది.

అలాగే నా భార్య విమల ఒక అటవీ అధికారి కూతురు. ఆమెకు ఇంకా చదువుకోవాలని కోరిక. స్త్రీ విద్య కోసం సరైన సదుపాయాలు లేక ఆమెను తండ్రి సరళాబెన్ ఆశ్రమానికి పంపాడు. ఆమె సోదరులిద్దరూ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. సమాజం కొరకు ఏదైనా చేయాలనే తపన ఆమెలో గాఢంగా ఉండేది.

నేనో రాజకీయ కార్యకర్తని. మీరాబెన్‌ని కల్సినప్పుడు ఆమె నాతో జవహర్‌లాల్ నెహ్రూ మంజూరు చేసిన పథకాలకి సంబంధించి గ్రామాల్లో పనిచేయాలని చెప్పింది. కానీ ప్రభుత్వం అందుకోసం అధికారుల్ని అక్కడికి పంపడంతో మీరాబెన్ ఆ పని విరమించుకుని కాశ్మీరు వెళ్ళిపోయింది. ఆ రకంగా మేము గాంధేయవాద ఉద్యమ కార్యకర్తలం.

కుటుంబ పెద్దలైన నా అన్న ఆమె నాన్న మా పెళ్ళి నిశ్చయించారు. పార్టీ రాజకీయాలని వదులుకుంటేనే నన్ను పెళ్ళి చేసుకుంటానని విమల వివాహ నిబంధన పెట్టింది. అందుకోసం నేను రాజకీయ పార్టీకి రాజీనామా చేసి సిలియారా అనే మారుమూల గ్రామంలో జూన్ 1956లో గ్రామీణులు, ముఖ్యంగా మహిళల సేవ కోసం ఆశ్రమం పెట్టడం జరిగింది. మా సొంత గ్రామాల నుండి వచ్చిన వందలాది మంది ప్రజల మధ్య నిరాడంబరంగా మేం పెళ్ళి చేసుకున్నాం.

అమ్మాయిల కోసం విమల రాత్రిబడి పెట్టింది. ఎందుకంటే అక్కడ అమ్మాయిలకి ఉదయం చదువుకోవడానికి వచ్చే అవకాశం లేదు. ఆ ప్రాంతంలో అసలు అమ్మాయిలని చదివించే సాంప్రదాయమే లేదు. చిన్న అమ్మాయిలయితే వారికంటే చిన్నవాళ్ళైన తమ్ముళ్ళని చూసుకోవాలి. కొద్దిగా పెద్దవారయితే అడవికి వెళ్ళి పశువుల్ని మేపడమో లేదా ఎండుకట్టె పుల్లలు ఏరుకు రావడమో చేయాలి. అక్కడ బాల్య వివాహాలు సాధారణం. ఇలాంటి అమ్మాయిలు స్వేచ్ఛగా ఆడిపాడడానికి మా ఆశ్రమంలో చోటుండేది. వారు ఆశ్రమంలో స్వేచ్ఛని అనుభవించగలిగేవారు.

పంట చేతికొచ్చాక కమ్మరి కుమ్మరి వృత్తులవారికి ఇచ్చినట్టే గ్రామస్తులు మాకు కూడా తిండి గింజల్ని ఇస్తుండేవారు. ప్రజలతో మమేకమై మేం పనిచేస్తుండేవాళ్ళం. మహాత్మాగాంధీలోని ఒక ప్రత్యేక లక్షణం ఏమంటే ఆయన ప్రార్థన చేస్తూ "ఈ దేశంలోని సామాన్యులలో ఒకడిగా మసిలే శక్తిని నాకు ప్రసాదించు స్వామి" అని భగవంతుడ్ని అడిగేవారు. ఆయన ఎన్నడూ కూడా "జనాల్ని పాలించే శక్తిని ఇవ్వమని" దేవుడ్ని అడగలేదు. ప్రజల్లో ఒకరిగా వుండడానికే ఆయన ప్రయత్నించేవారు. అలా ప్రజలతో కలిసి పని చెయ్యడంతోనే మా పని ప్రారంభమైంది. నేనో శ్రామిక సహకార సంఘాన్ని మొదలుపెట్టాను; విమల కార్మికుల పిల్లలకు చదువు చెబుతుండేది. ఆ విధంగా ప్రజలకు మాపై నమ్మకం ఏర్పడింది.

తర్వాత కాలంలో అంటే, 1960లో చైనా దురాక్రమణ సమయంలో భూదానోద్యమ నేతా, నడిచే భారతీయ సాధువుగా పేరొందిన ఆచార్య వినోబా భావే సరిహద్దు గ్రామాలకి గాంధీజీ శాంతి సందేశాన్ని తీసుకెళ్ళమని నాతో చెప్పారు. అప్పుడు నేను గ్రామాలకి నడక మొదలెట్టాను. గ్రామాల్లోని ప్రజలు చైనా దురాక్రమణని సైతం ధైర్యంగా ఎదుర్కోగలిగారు. కానీ మద్యం బారిన పడి బలహీనులవడం కనిపించింది. ఆదాయం కోసమని గ్రామాల్లో ఆరంభించిన ప్రభుత్వ మద్యం దుకాణాల వల్ల ఎన్నో రోడ్డు ప్రమాదాలు, ప్రశాంతమైన గ్రామాల్లో కొట్లాటలు పెరిగిపోయాయి. మనుషుల మధ్య సామరస్యతను మద్యం మింగేసింది. ఈ విషయాన్ని వినోభాజీకి తెలిపి మద్యానికి వ్యతిరేకంగా మహిళల మద్దతుతో ఉద్యమం చేపట్టాను. అలా స్వాతంత్ర్యోద్యమంలో మద్యం దుకాణాల ముందు పికెటింగ్ చేయడమనే గాంధేయవాద పోరాటరూపం మళ్ళీ పునః నిర్మించబడింది. మా ఆశ్రమం దగ్గర్లో కూడా ఒక దుకాణాన్ని తెరవాలనే ప్రతిపాదన వచ్చింది. "మద్యం, మాదక ద్రవ్యాల్లో మునిగితేలే భారతదేశం చైనాను ఎలా ఎదిరిస్తుంద"ని వినోబా ప్రచారం

చేసారు. ప్రతిపాదిత మద్యం దుకాణాం వద్ద పికెటింగ్ నిర్వహించడానికి ఉద్యోగ విరమణ చేసిన ఒక న్యాయమూర్తి చొరవ చూపాడు. ఎలాగైతేనేం, అక్కడ మద్యం దుకాణాన్ని పెట్టాలనే ప్రతిపాదనను ప్రభుత్వం విరమించుకుంది. తర్వాత మద్య వ్యతిరేక ఉద్యమం అయిదు జిల్లాలకు విస్తరించి అనేక మద్యం దుకాణాలు మూసేయడం జరిగింది. 1965 నుండి 1971 వరకూ ఈ ఉద్యమం ఉవ్వెత్తున కొనసాగింది.

ఆ తర్వాత ప్రభుత్వ కన్ను మా పర్వత ప్రాంతంలోని చెట్లపై పడింది. వాటి ద్వారా ఆదాయం సమకూర్చుకోవాలని చూసింది. ఆ దెబ్బతో 'అభివృద్ధి' బారినపడ్డ మా ప్రాంతంలో నీటి ఎద్దడి, కొండ చరియలు విరిగిపడటం వంటివి మొదలయ్యాయి. శాస్త్రీయ విధానం ద్వారా చెట్లను తొలగించడమనే నెపంతో లాభాల కోసం కాంట్రాక్టర్లు అదనంగా అసంఖ్యాక వృక్షాల్ని కూల్చి వేయడమే ఈ దుర్భర పరిస్థితికి కారణమనే నిజం మాకు తెలిసొచ్చింది. ప్రజలు వ్యతిరేకించడంతో ఈ కాంట్రాక్టు పద్ధతి రద్దయి ఆ స్థానంలో అటవీ అభివృద్ధి సహకార సంఘాలు, అటవీ కార్మిక సహకార సంఘాలు వచ్చాయి. అయితే మాకు త్వరలోనే అర్థమయిన విషయం ఏమిటంటే చెట్ల నరికివేతనేది కార్మికులు చేసినా, కాంట్రాక్టర్లు చేసినా వాటిల్లేది ఒకటే ముప్పు. గొడ్డలి పట్టుకున్న చెయ్యి, అదెవరిదైనా దుష్ఫలితం మాత్రం అందరిది. అప్పుడు అసలు మొత్తం చెట్ల నరికివేతను అడ్డుకుంటూ మేం ఉద్యమం చేయడం ప్రారంభించాం. అదే చారిత్రక చిప్కో మహోద్యమం. ఈ ఉద్యమ రథ సారథులంతా ముఖ్యంగా మహిళలు. నరకడానికి సిద్ధంగా ఉన్న చెట్లను కౌగిలించుకుని అడ్డు తగిలారు. ఆ విధంగా శాస్త్రీయ అటవీ అభివృద్ధి అనబడే తతంగాన్ని నిరోధించి లెక్కలేనన్ని చెట్లను కాపాడుకున్నారు. అడవి అనేది విరజిమ్మే సుగంధ ద్రవ్యాలకి, విశిష్టమయిన కలపకీ, విదేశీ మారక ద్రవ్యానికీ మాత్రమే మార్గం కాదనీ, అడవంటే మంచిమట్టి, స్వచ్ఛమయిన గాలి, శుభ్రమయిన నీరు అనే కొత్త విషయాన్ని తెలుపుతూ జీవన సారానికి అరణ్యం ప్రధాన వనరని ప్రకటించారు.

అలాంటి జీవనాధారాన్ని కాపాడుకోవడం అందరి కర్తవ్యమని ప్రజలు గుర్తించి ముందుకొచ్చారు. జీవితం అత్యంత విలువయినది. అంతటి విశిష్టమయిన దానికోసం అంతా కదిలారు.

అడవిలో నరకడానికి ఎంచుకున్న చెట్లకి గుర్తులు వేసి ఉంచేవారు. అలాంటి చెట్ల దగ్గరికి స్త్రీలు వెళ్ళి వాటిని కౌగిలించుకుని నిల్చునేవారు. అందుకోసం అడివిలో

గుడిసెలు వేసుకుని ఉండేవారు. చెట్ల నరికివేత కోసం నేపాల్ నుండి కార్మికుల్ని రప్పించినప్పటికీ ఫలితం లేకపోయేది. మహిళలు రాత్రింబవళ్ళు కాపలా కాసేవారు. ప్రభుత్వం ఎంతోమంది మహిళల్ని జైల్లో పెట్టించింది. విమల కూడా తన ఆరేళ్ళ బిడ్డతో ఈ ఉద్యమంలో జైలుకెళ్ళింది. అయినప్పటికీ మహిళలు వెనకడుగు వేయలేదు. నా అనుభవం చెప్పేదేమిటంటే, మహిళలు కనుక గట్టిగా ఏదైనా చేయాలని నిర్ణయించుకుంటే ఎన్ని కష్టనష్టాలెదురైనా వాళ్ళు అనుకున్నది చేసి తీరతారు. అలాగే జరిగింది. అధికారులు ఎంతలా అణిచివేసినా, ఎన్ని అవాంతరాలు పెట్టినా మహిళలు ఆ ఉద్యమాన్ని గొప్పగా కొనసాగించారు.

ఈ ఉద్యమం 1973 నుండి 1981 వరకూ జరిగింది. మొత్తానికి ఉత్తరాఖండ్ రాష్ట్రంలో వాణిజ్య అవసరాల కోసమని 1000 మీటర్ల ఎత్తైన వృక్షాలను నరకడాన్ని తాత్కాలికంగా నిషేధించారు. తర్వాత పొరుగు రాష్ట్రమైన హిమాచల్ ప్రదేశ్‌కి ఈ నిషేధాన్ని విస్తరింపజేసారు. ఐతే ఏప్రిల్ 2006 లో హిమాచల్ ఈ నిషేధ ఉత్తర్వుల్ని ఎత్తేసింది. అప్పుడు నేను చేసిన ప్రకటనపై స్పందించిన సర్వోన్నత న్యాయస్థానం చెట్ల నరికివేత జరగకుండా మళ్ళీ తాత్కాలిక నిషేధం విధించింది.

చిప్కో ఉద్యమంలోనే తరువాతి మెట్టు ఏమిటంటే కొండ చరియల్లో పచ్చదనాన్ని పెంపొందించడం. ఆరోగ్యకరమైన ఆహారం, ఎరువులు, కలప ఇచ్చే చెట్లను పెంచడం. ప్రపంచ ప్రసిద్ధ అరణ్యవేత్త రిచర్డ్ సెయింట్ బార్బ్ బేకర్ మా ఈ నిర్ణయాన్ని స్వాగతిస్తూ మద్దతివ్వడమే కాదు, కొండల్లోని ఏ చెట్టునూ కూడా కూల్చకూడదని ప్రకటించారు. ఆ విధంగా కొండ చరియలు విరిగిపడకుండా చాలాచోట్ల చెట్లు ప్రకృతిని సమన్వయం చేస్తూ కాపాడాయి. అలా చెట్ల నరికివేత నిరోధించడం వల్ల ఎన్నో ప్రమాదాలు, ప్రకృతి వైపరీత్యాలు జరగకుండా నివారించ గలిగాం.

ఐతే, గంగా నదిపై 263 మీటర్ల ఎత్తులో సోవియట్ యూనియన్ సహకారంతో నిర్మించ తలపెట్టన అతిపెద్ద టెహ్రీ ఆనకట్ట నిర్మాణ కాలంలో మేం ఈ వుద్యమాన్ని కొనసాగించలేకపోయాం. అందుకు వ్యతిరేకంగా మేము అహింసాత్మక ఉద్యమాన్ని చేపట్టాం. రెండుసార్లు నేను సుదీర్ఘమైన నిరాహార దీక్షలు చేసాను; ఒకటి 49 రోజులయితే, మరోటి 74 రోజులు. ప్రజల ఆందోళన వల్ల ఆనకట్ట నిర్మాణకర్తలకు తీవ్ర ఆటంకాలు ఏర్పడినప్పుడు, సరిగ్గా ఒక బస్సు ప్రమాదం జరిగింది. 16 మంది చనిపోయి అనేకమంది గాయపడిన ఆ ప్రమాదం కావాలని

కుట్రపూరితంగా చేసిందనే వాదన ఉంది. అది జరిగాక ఆనకట్ట నిర్మాణదారులు, తాబేదారులు కసాయిలనీ కాబట్టి, ప్రజలు సంయమనం పాటించాలని చెప్పాను. అయినప్పటికీ 17 ఏళ్ళుగా నేనూ, విమల ఈ ఆనకట్ట విషయంలో కృషి చేస్తూనే వున్నాం. హిమాలయ భూగర్భశాస్త్ర నిపుణుడు డా. కె.యస్. వాల్డియా వాదన ప్రకారం ఈ ఆనకట్ట 30 ఏళ్ళు మాత్రమే మనగలుగుతుంది. నీటి ప్రవాహం 50 శాతం తగ్గుతుంది. దాన్నిక పెంచేందుకు సాధ్యం కాదు.

మా పోరాటాలన్నింటి అంతిమ సారం తాత్కాలిక ఆదాయం కోసం ప్రకృతిని సొమ్ము చేసుకోవాలనుకునే వైఖరిపై తిరగబడటం. ఒక్కసారి వినాశనం కాబడిన ప్రకృతి తిరిగి దాని సిసలయిన జీవాన్నెప్పటికీ మళ్ళీ పొందలేదు. ఇప్పటికే అనేక జీవజాతులు అంతరించిపోయాయి. ఈ భూమిని అన్ని జీవరాశులకీ అనుగుణంగా చేసి, ప్రకృతి కోల్పోయిన సహజ సంపదల్ని పునరుద్ధరించి భావి తరాలకి గౌరవంగా ఎలా అందించ గలుగుతామనేది ఈ తరం ముందున్న అసలైన సవాలు. విభిన్నతను కాపాడుకోవడంలో మనం ఆదిమ మానవుల కంటే వెనకబడి ఉన్నాం. మనం అనుసరిస్తోన్న నాగరికతలోనే ఈ దోపిడీ స్వభావం ఉంది. నాగరికత సృష్టించిన ఈ సంక్షోభాన్ని సంస్కృతి మాత్రమే పరిష్కరించగలదు. గాఢమైన అరణ్యాల్లో గంభీరమైన వాతావరణంలో ఏర్పడ్డ ఆశ్రమ సంస్కృతి ఈ దేశానికి ఉంది. ధనిక పేద వ్యత్యాసాలు లేకుండా రుషులు ఈ ఆశ్రమాల ద్వారా వాటి యువజనులకి విద్యని ప్రసాదించారు. అదే జీవితం గురించిన చదువు, జీవన విద్య.

మన అస్తిత్వం కోసం వేసుకున్న ప్రశ్నలే గాబరా పెడుతుండగా, మళ్ళీ మరణానికి చేరువ అవుతున్న భూగోళం గురించిన సవాలుని యువత స్వీకరించడానికి ముందుకొస్తారా అనేది ప్రశ్న. వాళ్ళు ముందుగా అధికారం, సంపద, ఆయుధాలు, అతితెలివి నాలుగు స్తంభాలుగా ఉన్న ఈ సమాజంలోని నిద్రావస్థ నుండి మెలకువలోకి రావాలి. వీటి స్థానంలో సేవ, త్యాగం / సంయమనం, శాంతి, సుబుద్ధి సమాజ స్తంభాలుగా ఉండాలి. సంఘంలోని సర్వులకీ అవకాశాలు, అభివ్యక్తులు సమానంగా కేటాయించగలిగే వ్యవస్థను స్థాపించడమే సర్వోన్నత విశ్వమానవ లక్ష్యం. అదే సర్వోదయం. అందరి అభివృద్ధికి నిలయం. మన కాలపు ఆచరణాత్మక దార్శనికుడు మహాత్మాగాంధి మహత్తర స్వప్నం ఇదే. ఇరవై ఒకటవ శతాబ్దంలో సైతం సోక్రటీసు సత్యాన్వేషణనీ, జీసస్ త్యాగ నిరతినీ, గౌతమ బుద్ధుడి అహింసనీ తన వ్యక్తిత్వంలో ఇముడ్చుకున్న మహామానవుడు మహాత్మాగాంధీజి.

పీడితులంతా ఏకమవ్వాలని గాంధీ బోధించారు. ప్రపంచంలోని ఇతరేతర ఉద్యమాలకి భారత స్వాతంత్ర్యోద్యమానికీ గల ప్రధాన వ్యత్యాసం ఇదే. గాంధీజి పీడితుల్ని సమీకరించగలిగాడు. ఎవరైతే పీడనని అనుభవించారో, వారికి ధైర్యాన్ని ఇవ్వగలిగాడు. సమయం పట్టొచ్చు కానీ ప్రజలే పోరాట సైనికులుగా కావాలని ఆశించాడు. అదే అహింసా వాదంలోని ప్రత్యేకత. శతాబ్దాల క్రితమే అహింసని ఆయుధంగా చేసుకున్న విశిష్టమయిన వ్యక్తి మహాత్మా బుద్ధుడు పుట్టిన దేశం ఇది. తదనంతరం ఎంతోమంది ఆయన్ను అనుసరించారు ఐతే, గడిచిన శతాబ్దంలో ఈ అహింసా సిద్ధాంతాన్ని నూతన దృక్పథంతో పునర్నిర్మించి మానవాళి ముందు పెట్టిన ఏకైక వ్యక్తి గాంధీ ఒక్కడే. రెండో ప్రపంచ యుద్ధం వల్ల జపాన్ దేశ పరిస్థితి ఏమైందీ మనకి తెలుసు. కానీ యుద్ధాలు మానవ దేహాలపై విజయం సాధిస్తాయి తప్పా ఆత్మల్ని తాకలేవంటాడు గాంధీ.

మన సంస్కృతిలోని విశిష్ట విశ్వాసం ఇదే; మనం ఆత్మను నమ్ముతాం. బయటిది భౌతిక దేహం, లోపలిది ఆత్మ. ఆత్మకి చావు లేదు. మీరు దేహాన్ని చంపవచ్చు కానీ ఆత్మని చంపలేరు. తూర్పు దేశాల సంస్కృతిలోని ప్రత్యేక స్వభావం ఇదే.మనం ఆత్మ యొక్క శక్తిని నమ్ముతాం. సైన్యాల మధ్య జరిగే యుద్ధంలో పెద్ద సైన్యం చేతిలో చిన్న సైన్యం వోడిపోవచ్చు. కానీ, ఆత్మస్థైర్యం, దృఢమైన సంకల్పబలం ఉన్న వ్యక్తి ఏకాకిగా ఎదురెళ్ళినా లోకంలోని సైన్యాలన్నీ కలిసికట్టుగా కూడా ఆ వ్యక్తిని వోడించలేవు. ఆ విషయాన్ని మనం ఈరోజు సంకల్పబలంతో జీవించే ఉన్న బుద్ధునిలో, జీసస్‌లో, గాంధీలో స్పష్టంగా చూడవచ్చు. అంతరాత్మలెంత శక్తివంతమైనవో వారు మానవాళికి నిరూపించి చూపారు. మనకి అవి గొప్ప పాఠాలు. వారి శరీరాలేవీ ఈరోజు మనతో లేకున్నా, విడిచిన చైతన్యం మాత్రం ఈనాటికీ ప్రకాశిస్తూనే ఉంది.

అసలు ప్రార్థించడం అంటే ఏమిటి? ప్రార్థన ద్వారా మన అంతరాత్మని బలోపేతం చేయమని ఆ సర్వేశ్వరుడ్ని అడగడం. అది భౌతిక బలం కాదు, మానసిక శక్తి. ప్రతిరోజూ ఉదయ సాయంత్రాలు అంతర్గత శక్తికోసం మనం ప్రార్థిస్తాం. ఆ శక్తే మనల్ని ఐహిక విషయాల్లోనే కాదు ఆధ్యాత్మిక అంశాల్లో కూడా సమర్థులుగా మలుస్తుంది.

కాబట్టి, మిత్రులారా చిప్కో ఉద్యమంలో మా సందేశం ఇదే; "మమ్మల్ని నరుకుతామన్నా సిద్ధమే కానీ చెట్లని నరుకుతామంటే మాత్రం ఒప్పుకోం." ఆ సందర్భంగా 'ఎన్ని గొడ్డళ్ళనయినా ఎత్తండి మీరు–మేం మా చెట్లను కాపాడుకుంటాం' అనే పాటను కూడా రాసాం. ఈ దృఢ సంకల్పం మా గుండెల్లోంచి వొచ్చింది. కానీ చిప్కో ఉద్యమానికి సంబంధించి నేను చెప్పేదొకటే, మీ అందరాత్మల్ని బలోపేతం చేసుకుంటే మీరెంతటి మహత్కార్యాన్నయినా చేయవచ్చు. కానీ, అంతర్గత శక్తి సామర్థ్యాల్ని పెంచుకోవాలి. మానవ చరిత్రలోని గొప్ప బోధకులంతా అలాగే చేసారు. బుద్ధుడు, జీసస్, గాంధీ అంతా ఇదే చేసారు. అంతరాత్మని బలోపేతం చేసుకోవడం. అదంటూ చేయగలిగితే, మన దేహం నశించవచ్చు కానీ ఆత్మ ఎప్పటికీ మరణించదు. అంతరాత్మతోపాటు ప్రకాశవంతంగా వెలుగొందుతూనే ఉంటుంది. ఈ సందేశం ఇతరులందరికీ చేరాలి. అదే మా అనుభవాల నుండి మేము నేర్చుకున్న నీతి.

## ప్రజల గుండెల్లో చిప్కో ఉద్యమం

ఈ జనాందోళనలు జానపద గీతాల ద్వారా ప్రజా బాహుళ్యంలో ప్రచారం అవుతాయి. ప్రజా ఉద్యమాలకి అవశరమైంది ఆగ్రహం కాదు హృదయం. ప్రజలకి హృదయం ఉంది. వారిని కార్యాచరణకి సిద్ధం చేయాలంటే మనం వారి హృదయాల్లోనికి చేరాలి. గుండెల్లోకి చేరినదే చేతల్లోకి మారుతుంది. అలా ఆరంభంలో జానపద పాటల ద్వారా మా ఉద్యమం ప్రజల గుండెల్లోకి చొచ్చుకుని పోయింది. ప్రసంగాలు, పుస్తకాలు, పత్రికలు ఏవీ లేవు. పాటలొక్కటే ప్రవహించాయి. వాటి ప్రభావంతోనే ప్రజలు ఉద్యమాలు చేసేందుకు ముందుకు వచ్చారు. ఇతరేతర ఉద్యమాల్లో ప్రజల విజ్ఞత తట్టిలేపచ్చు. కానీ ప్రజా ఉద్యమాల్లో హృదయాల్ని మాత్రమే తాకగలగాలి. మెదడులో ఉన్నదాన్ని హృదయంలోకి తీసుకొచ్చి, తద్వారా చేతుల్లోకి చేర్చడమే చేయాలి.

ప్రపంచంలో ప్రతి ప్రజా ఉద్యమానికీ ఇది వర్తిస్తుంది. గుండెల్లో నుండి దూసుకువచ్చే ఆచరణ ప్రభావం దీర్ఘకాలం ఉంటుంది. ఈ ఉద్యమాలకి అధికారం ఏమీ చేయలేదు. ఎందుకనంటే, అధికారం దేహాన్ని దాటి రాలేదు. అంతరాత్మని ఆపలేదు. అరెస్టు చేసి జైల్లో పెట్టగలరేమో కానీ అధికారం ద్వారా ప్రజల హృదయాల్లో మార్పు తీసుకుని రాలేరు. ఒక్కసారి ఒక బలమైన భావన ప్రజల హృదయాల్లో లోతులో నాటగలిగామా, ఇక వాళ్ళే దానిని సొంతం చేసుకుంటారు. అలాగే జానపాద గీతాల్లోని ప్రత్యేకత ఏమంటే, మనతో కలిసి పాడినప్పుడు వాటిని ప్రజలే సొంతం



**చిప్కో ఉద్యమంలో మహిళలు**

చేసుకుంటారు. అవి జనంతో మమేకమై జానపద గీతాలుగా మారి చిరస్థాయిగా వర్ధిల్లుతాయి. ప్రసంగాల్లో వక్త తన భావాల్ని ప్రజల ఎదుట వ్యక్తపరుస్తాడు. ఎంత గొప్ప ఉపన్యాసమైనా అదో వ్యక్తిగత అభివ్యక్తి మాత్రమే. అదే జానపద పాటని జనం వెంటనే సొంతం చేసుకుని పాడటం ప్రారంభిస్తారు. పాటలు పాడినంతగా ప్రజలు విన్న ప్రసంగాల్ని గురించి మళ్ళీ ప్రస్తావించుకుంటారని నేననుకోను. అదేపాటలో వాళ్ళు లీనం కాబడి వెంటనే ఆ గానంలో భాగమవుతారు. చిప్కో ఉద్యమ గీతాలు హిమపర్వతాల్లో, అరణ్యాల్లో అలాగే మారుమోగాయి. మహాశిఖరాలు మొదలుకుని కీకారణ్యాల వరకూ ఎవరి ప్రమేయం ప్రత్యేకంగా లేకుండానే ప్రతిధ్వనించాయి. ఆడుకునే పిల్లలు, నిరక్షరాస్యులయిన పల్లె జనాలు, చిట్టడివిలో గడ్డికోసం వచ్చే మహిళలు, కట్టెలు ఏరుకునే గృహిణిలు అందరూ ఈ పాటల్లో మమేకమయ్యారు. చిప్కో ఉద్యమానికి సంబంధించిన విశిష్టత ఏంటంటే, ఇందులోని జానపద గీతాలు జనశ్రేణుల్లో విపరీతంగా గుర్తింపు సంతరించుకున్నాయి.

అయాచితంగానే మనకి లభ్యమయిన మూడు వరాలున్నాయి. మెదడు, హృదయం, చేతులు. కానైతే, యుక్త వయసులో మనకి వీటి ప్రాధాన్యత తెలీదు. మానవ మేధస్సు ఉన్నది సృజనాత్మక వివేచన కోసమే కానీ పరీక్షల్లో ర్యాంకుల కోసం పుస్తకాల్లో ఉన్నదంతా బుర్రల్లోకి కూరుకోవడం కోసం కాదు. మేధస్సు చేసే మహోన్నత కార్యం స్వతంత్రంగా ఆలోచించగలగడం. ఈరోజు మనం అనుభవిస్తున్న సౌకర్యాలన్నీ అలా ఆలోచించడం వల్ల అందుబాటులోకి వచ్చినవే.

భావితరాల సౌభాగ్యం కోసం నిస్వార్ధపరులయిన కొద్దిమంది చేసిన సృజనాత్మక కృషి వల్ల జనిస్తున్న బహుమతులే ఇవన్నీ.

మానవ హృదయానికి అర్థం కరుణ మాత్రమే. హృదయం ఉన్నది లోభత్వం కోసమో స్వార్థపరత్వం కొరకో కాదు. మానవాళి ఉన్నతికి మార్గదర్శకులు బుద్దుడు, క్రీస్తు, గాంధీ వంటి వారి గుండెల నిండా కరుణ, జాలి, దయలే నిండి ఉంటాయి. కేవలం మనుషుల పట్ల మాత్రమే కాదు, పశుపక్ష్యాదుల నుండి పర్వతాది మహావృక్షాల వరకూ జీవరాశులు మొదలు జీవనదులు దాకా అన్నింటి పట్ల అదే ప్రేమపూర్వక దృష్టి. ఎంతగా ఇస్తే అంతగా తిరిగి పొందగలం అనేది ప్రేమ సూత్రం. అందరి నుండి ప్రేమను స్వీకరించడంలోని రహస్యం ఇదే. మీరు అందర్నీ ప్రేమించగలిగితే అందరూ మిమ్మల్ని ప్రేమిస్తారు. అప్పుడిక మీరు జీవితాన్ని చూసే తీరు మారుతుంది. నేటి భౌతికమైన యాంత్రిక నాగరికత మనల్ని లోభుల్ని చేసింది. మనం మన ప్రయోజనాలే కాని ఇతరుల బాగోగులు పట్టించుకునే పరిస్థితిలో లేం. కానీ, ఈ విశ్వమంతా మన విడిదే; సృష్టిలోని జీవరాసులన్నీ మన సోదరసోదరీమణులే. ఇతరుల పట్ల మన దృష్టి ఎల్లప్పుడూ ఇలాగే ఉండాలి.

ఇక మన చేతులు నిర్మాణానికే కాని నాశనం చేయడానికి కాదు. జీవితంలో ఆనందం, ఆరోగ్యం, తృప్తి ఉండేందుకు ఇవే రహస్యాలు; మన జ్ఞానం, హృదయం, శరీరం మూడింటినీ సరిగా వుపయోగించగలగడం. రేపటి కోసం ఎదురుచూడకుండా



**పర్యావరణోద్యమ జంట స్వరాలు... సుందర్లాల్ బహుగుణ, విమల దంపతులు**

చేయాల్సినవి పూర్తి చేయడం. మీరు చేయాలని అనుకున్న మంచి పనుల్ని వెనువెంటనే ఈరోజునే ప్రారంభించండి; ఎందుకంటే వేల సంవత్సరాల కాలక్రమంలో రేపనేది ప్రతిసారి గతంగా మారిపోతూనే ఉంటుంది. మంచి పనికి రేపనేది లేనేలేదు. అందుకే మీ పని ఈ రోజే మొదలుపెట్టండి. మంచిపని ఎప్పుడూ పుంజుకుంటుంది. అదే మనకు నిజమయిన వికాసం.

పాత భావాల్ని పట్టుకుని వేలాడటం ప్రగతికి పనికిరాదు. వికాసం అనేది నూతనత్వంతోనే సాధ్యం. నూతన ఆలోచనలు ప్రకృతిలోను, ప్రజలతో కొత్తగా నిర్మించుకునే మానవ సంబంధాల్లోనూ మాత్రమే ఉంటాయి. కాబట్టి, కొత్త మనుషుల్ని కలవండి. కొత్త అనుభవాల కొరకు అన్వేషించండి. సెలవుల్లో తీరిక చూసుకుని సమిష్టిగా ప్రకృతిలోకి ప్రయాణాలు చేయండి. అవి మీ మనసుకి సంతోషాన్ని, ఆలోచనలకి సామర్థ్యాన్ని ఇస్తాయి. వాహనాల్లోకి పెట్రోల్ ఎలాంటిదో మనుషులు పునరుత్తేజం పొందడానికి ప్రకృతి అలాంటిది. ఎందుకంటే ప్రకృతే మనకి నిజమయిన నివాసగృహం. అది గ్రహించకుండా ప్రకృతికి దూరం జరిగితే మనం ఇల్లులేని పిల్లల్లా తయారవుతాం; తల్లిలేని పిల్లలమవుతాం. ఆసరా – ఆవాసమూ లేని అసహాయులుగా ఆఖరికి మిగులుతాం. ఆధునిక జీవితంలోని బాధాకరమైన వాస్తవం ఇదే. మనం తయారుచేసుకున్న కృత్రిమ ప్రపంచాన్ని చూసి మురిసిపోతూ అదే అభివృద్ధి చెందడమనే భ్రమల్లో బతుకీడ్చడం; జీవించడం కోసమైతే ప్రకృతి దగ్గరికి వెళ్ళాలి. అదెలా ఉంటుందో ఎవరికి వారుగా అనుభూతి చెందవలసిందే కానీ ఆ అనుభవాన్ని వర్ణించడానికి పదాలు సరిపోవు మరి.

ఈ విషయాన్ని ఇంత కచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నానంటే జేబులో ఒక్క పైసా కూడా లేకుండా నేను స్వయంగా ఇలా ప్రయాణించి ఆ అనుభూతిని పొందాను కనుక. కాశ్మీర్ నుండి కోహిమా వరకూ, హిమాలయాల పడమటి వైపు నుంచి తూర్పు సరిహద్దు దాకా, మొత్తం 4,870 కిలోమీటర్లు కాలి నడకన తిరిగి చిప్కో ఉద్యమ సందేశాన్ని విశ్వజనీనం చేయడానికి ప్రయత్నించాను.

ఈ యాత్రలో మొదటిది మీ కడుపు ఎలా నింపుకోవాలన్నదే. అందుకు ఒక మార్గం ఉంది. ఊర్లోకి మనం వెళ్ళగానే మన వెంటపడేది కుక్కలు, పిల్లలు. కుక్కల్ని తరిమేసి పిల్లలతో ఆడుకుంటే చాలు. సాయంత్రం అవగానే రోజూ వచ్చే పిల్లలు ఇంకా రాలేదని ఇంటి దగ్గర చూస్తుంటారు. అప్పుడు నేను 'సరే, మీరిక ఇళ్ళకి వెళ్ళండి' అంటాను. వారు నాతో 'మరి నువ్వెక్కడికి వెళతావు? ఏం తింటావు?' అని


మీరా బెన్

అడుగుతారు. అప్పుడు నేను అక్కడే ఉంటానని చెప్పి ఇంట్లో అడిగి ఒక రొట్టె తీసుకు రమ్మంటాను. అలా బోలెడు రొట్టెలు. కొన్ని కుక్కలకి పెట్టి మరికొన్ని మరుసటి రోజుకోసం దాచుకుంటాను. ఉదయం పూట గ్రామాల్లో అందరూ పనుల్లోకి వెళ్ళిపోతారు. కనుక తిండి దొరకడం కష్టం. ఒకసారి ఒక ఊరికెళ్ళేసరికి బాగా ఆలస్యమై చీకటి పడింది. పిల్లలెవరూ కనిపించలేదు. గ్రామస్తులేమో భయంతో తలుపులేసుకుంటున్నారు. అప్పుడో పెద్దాయన నన్ను కిటికీ గుండా చూసి వచ్చింది దొంగ కాదని మిగిలిన వారికి చెప్పాడు. ఎందుకనంటే, దోపిడీ దొంగలు ఉత్త చేతులతో వచ్చి ఉన్నదంతా దోచుకుని పట్టుకెళ్ళిపోతారు. కాబట్టి పెద్ద సంచిని మోసుకుని తిరుగుతున్న నేను దొంగని కాదని కనిపెట్టారు. అలా అనేక అనిర్వచనీయ అనుభవాలతో మూడొందల రోజుల పాటు సుదీర్ఘమయిన పాదయాత్ర పూర్తి చేసాను.

మిత్రులారా, ఆ రకంగా నిజమైన విద్య అంటే జీవితంలో కొత్త అనుభవాలను పొందడం మాత్రమే. అవే మిమ్మల్ని సుసంపన్నం చేస్తాయి. పుస్తకాల్లో రాసిందంతా మంచిదే కావచ్చు కానీ మరపురాని అనుభవాల్ని మాత్రం మీకు మీరే సంపాదించుకోవాలి. పుస్తకాలు రాసిన వాళ్ళ అనుభవాలన్నీ పాతబడిన గతానికి చెందినవి; కానీ మీరు బతకాల్సింది భవిష్యత్తు ఉన్న ఆగతంలో మాత్రమే. కొత్త కాలాలకి పాత అనుభవాలు పనిచేయవు. కాబట్టి మీ అనుభవాలు మీకుండాలి. ఆత్మస్థైర్యాన్ని పెంపొందించే నూతన అనుభవాలతో మిమ్మల్ని మీరు పరిపుష్టం చేసుకోవాలి. ఇది డిగ్రీలలాంటిది కాదు. అంతకు మించిన ఆత్మగౌరవ సాధన. అనుకుంటే ఏ పనైనా చేయగలం అనే ఆత్మ విశ్వాసం. ఆత్మవిశ్వాసం అత్యున్నతమైనది. ఏ విధమైన విజయ సాధనకైనా అదే మూలం.

## భూతల్లి గాయాల్ని మాన్పుదాం, రండి!

ఈరోజు ప్రపంచం చాలా చిన్నదైపోయింది. కానీ, ప్రతిచోటా గాఢాంధకారమే అలుముకుని ఉంది. ఈ చీకటి తొలగిపోవాలి. జపాన్‌ని సూర్యోదయ దేశమని పిలుస్తారు. ఆదిత్యుడి రాకతో అంధకారం పోతుంది. కరెంటు బల్బులు, బ్యాటరీ

లైట్‌లు ఈ చీకట్లని ఆపలేవు. స్వార్థ ప్రయోజనాల చీకట్లు, సరిహద్దు వివాదాల చీకట్లు, అజ్ఞానాంధకారాలు. ఇవన్నీ తొలగిపోవాలి.. మనందరం భూగోళ పౌరులుగా మారినప్పుడే నిజమయిన వికాసం. మానవాళికి మెదడు ఆలోచించ డానికి, హృదయం అనుభూతి చెందడానికి, చేతులు నిర్మాణం చేయడానికి ఇవ్వబడ్డాయి. అందరి కష్టాలనీ తొలగించడం ప్రతి ఒక్కరి కర్తవ్యం. అత్యాధునికులమని ప్రగల్భాలు పలికే ఈ మన వ్యవస్థలో ఈసరికే లెక్కలేనన్ని జీవరాశులు అర్థాంతరంగా అంతరించిపోయాయి. మనిషి అత్యాశ మూలంగా ప్రతీ క్షణం ప్రపంచంలోని ఏదోక ప్రాంతంలో ఏవోక అరుదయిన జీవజాతులు ఇప్పటికీ మాయమైపోతూనే ఉన్నాయి. ఇంతటి మహా వినాశనానికి కారణం మానవుడి దురాశే.



సరళ బెన్

గాయపడిన నేలతల్లికి గత వైభవాన్ని మళ్ళీ తీసుకురావడమే మన జీవిత లక్ష్యం. అందుకోసం అవసరమయిన శక్తి సామర్థ్యాల్ని ప్రకృతే మనకు ప్రసాదిస్తుంది. అన్ని జీవజాతులు ఆనందంతో జీవించగలిగేలా ఈ భూమిని మరమ్మత్తులు చేసి మళ్ళీ పునర్వికసింపజేయడమే ఈరోజు మనముందున్న అతిపెద్ద సవాలు. దూరమయిన బిడ్డల్ని ప్రకృతి తల్లి దగ్గరికి ఎలా చేర్చి, తిరిగి ప్రకృతిని సంపద్వంతం చేస్తామనే ఆలోచనే మనం చేయాలి. జీవంతో నిండిన జవసత్వాలతో, సకల జీవజాతుల్ని సంతోషంతో పాలించే ప్రకృతి పచ్చగా కళకళలాడాలి. మన జీవన విధానంలో నిర్దిష్టమయిన మార్పుచేర్పులు చేసుకోవడం వల్ల మహత్తరమైన ఈ సత్కార్యం సాకారం కాగలదు.

నేను జపాన్ దేశానికి ఆ నమ్మకంతోనే వచ్చాను. ఉదయించే సూర్యుడి దేశంగా అపారమయిన నమ్మకంతోనే ఈ దేశానికి నేను వచ్చాను. సూర్యోదయం అంటే అర్థం ఏమిటో తెలుసా? అలముకున్న చీకట్లు పటాపంచలు కావడం. నేను ప్రస్తావించిన ప్రపంచపు చీకట్లు; యుద్ధం, కాలుష్యం, పేదరికం అంతర్ధానమైపోవడం. అదే ప్రపంచానికి సూర్యోదయం.

నేను ఒక వయసయిపోయిన ఆచరణాత్మక సామాజిక కార్యకర్తని. ఇంతకుముందే నేను చెప్పినట్లు, నేను సుదీర్ఘమయిన పాదయాత్రలు చేసాను. ఎంత గొప్ప సందేశాన్నయినా విస్తృతం చేసే మార్గం నడక మాత్రమే. ఇంకా, కావాలంటే మీరు సైకిళ్ళు ఉపయోగించుకోవచ్చు. టోక్యో నుండి టొరెంటో వరకూ ఇలాంటి యాత్ర చేయాల్సిందిగా యువజనుల్ని నేను కోరుతున్నాను. టోక్యో, టొరెంటోలు ఎక్కడ ఉన్నాయో మ్యాప్‌లో మీరోసారి చూడండి. టోక్యో తూర్పున వుంటే, టొరెంటో పడమరన ఉంది. అంటే ఈ మన సందేశం ప్రపంచంలోని ఎక్కువమందికి చేరగలుగుతుంది. ఈ యాత్ర ఇచ్చే సందేశం తేలికైన ఒక్క పదం – శాంతి. ఈ సందేశాన్ని ఇస్తూనే బుద్ధుడు నడిచాడు. ఈ సందేశం ఇస్తూనే జీసస్ శిలువ వేయబడ్డాడు. మరి మనం ఎందుకు ఈ సందేశాన్ని ఇవ్వకూడదు? ప్రతిచోటా మిమ్మల్ని ఆహ్వానిస్తారు.

నూతన భావాలుగల వ్యక్తుల శాతం సంఖ్యలో ఎప్పుడూ తక్కువే. కానీ, కొత్త ఆలోచనలు కలిగించే మంచి పనులు అలాగే వ్యాప్తి చెందుతాయి. టోక్యో నుండి టొరంటోకి. వినడానికి బాగుంది కదూ. కొత్త కార్యక్రమాలు చేసేటప్పుడు ప్రజల కాల్పనికతని అవి కదిలించగలగాలి. ఊహాత్మకమైనవే అయినా ఉచ్చరణ కూడా ప్రధానం. అలా ఈ కార్యంలో రెండు ఊర్లపేర్లూ 'ట'తో మొదలవుతాయ్. బాగుంది.

మనం సాధించవలసిన అసలయిన సిసలు లక్ష్యం శాంతి. మన ప్రార్థనలు, పూజల్లో మూడుసార్లు ఉచ్చరించే "శాంతి, శాంతి, శాంతి" అనమాట. దీని అర్థం, మన లోపల ఉండాల్సిన శాంతి, మన చుట్టూ సమాజంలో నెలకొల్పాల్సిన శాంతి, ప్రపంచ శాంతి. కాబట్టి, టోక్యో–టొరంటో పాదయాత్రలో పాల్గొనేవారంతా పఠించాల్సిన మహామంత్రం : శాంతి, శాంతి, శాంతి.

ఉదయించే సూర్యుడి దేశంలో ఉన్న యువజనులంతా ఈ మహత్తరమయిన శాంతి సందేశాన్ని ప్రపంచ మానవాళి దగ్గరకు విశ్వాసంతో దృఢంగా తీసుకుని వెళ్ళండి. ఈ జగత్తంతా మీ రాకకోసం వేచి చూస్తోంది. మీరు చేయాల్సిందల్లా ముందుకు సాగడం, ఎల్లపుడూ ముందుకు సాగిపోవడం మాత్రమే.

***